Sree

# VISHNU DANDAKAMU

BY

G. SURYANARAYANA SASTRI,

*Telugu Pandit,*

Board Secondary School,

NARSIPATAM.

Published by the Author.

Price: 1 Anna.

PRINTED

AT THE S. S. M. PRESS,

శ్రీరస్తు.

# విష్ణుదండకము.

శ్రీమద్రమారామ గోవింద నారాయణా భక్తకల్పద్రుమా సత్యభామామనశ్చోర తగా రా మహాశ్చర్య కోటిస్మరాకారలీలా మనుష్యావతారా మహామేరుధీరా సదాపాపదూరా సదాచార స్వేచ్ఛావిహారా శుభాకార వీరాధివీరా హరీ పూర్వదేవారి దుర్వార పాథోధిగంభీర దామోదరా దీనమందార రారా మురారీ కృపాంభోనిధీ కావరా లోకచింతామణీ మానిచింతామణీ చక్రపాణీ సుకోదిష్ణు జిష్ణూ మహాల్లోకవర్ధిష్ణు విష్ణూ సభూలంకరిష్ణూ హరీ ద్వారకావాస నాకేశ లోకేశ హేయాశనా యాంశలన్ గోయుగాబ్ధి మీకోసరాన్నవ్రిథా.

భాసమానా ముకుందాదిదేవా యనంతాభి
ధానా మహాదేవ దేవా సదా నెమ్మదిన్నమ్మి నీ
కంటె దైవంబులు న్వేరు లేరంచు నీపాదపద్మం
బుల న్భక్తితో గొల్చెదన్ సారసాక్షా హృషీ
కేశ కాపాడవా మత్స్యమై తొల్లి పాథోధి
లో జొచ్చి యాఘోరాకారు నాసోమకు న్ద్రుంచి
వేదంబుల న్బ్రోచవే దేవతల్ రక్కసుల్ క
వ్వముల్ మంధరగ్రావము న్బూని నాగేంద్రునిం
ద్రాడుగాబట్టి చిల్కంగ బెగ్మ్రుంగినన్ దంచినై
కూర్మమై క్రిందను న్దూచ్చి నీవీపుతో మందరా
గ్రావమున్ లేవనెత్తంగ నెత్తవే యీ
శ హేమాక్షు డీగోత్రముం జాపగా జుట్టగా
ఘోణివై వానిఖండించి సర్వంసహాభారమున్నా
న్ని లోకంబు గాపాడవా మున్ను కృష్ణా జగ
ద్ధేతుకారా నృసింహావతారుండవై భీకరాకార
ముం జూప బాకారిశత్రుండు దుర్గాంకారముం
జేయ సాకారివై నీవు నాకేశ వజ్రప్రతీకాశ

పొసగ వాగ్రింబుల నుప్పసక్తించసం జిల్చి లో
కాని ౦. బాపవే భక్తమందార ప్రోహుమని
నొప్పవవే దేవ యింసుగ్రింపు వర్ణిలుటం గోరి
యిందాగ్నిజా వానినుండంచు జేరోంది యా
చ్యాగమై దాత లెవ్వా రీ ధారుణీచక్రమం
దంచు. బ్రశ్నించి ధాలిసుమల్ సెప్పగా యా
తుథానేశ్వోసుం జేరి యోచక్రవర్తి మహాపుణ్య
మూర్తి వదాన్యోత్తమా హాఖలీసార్వభౌమా
మహారాజరాజా మహాపద్మమార్తాండ తేజోవి
రాజా యిదే యొంటివాడన్ ధరానాథ దీనుం
డ నో దీనమందార యన్నంతలో నావదా
న్యుండు సంతుష్టుడై నిండుచిత్తంబుతో నిండు
వాగ్దాన మీయంగ మూడడ్గులే గోత్రమున్
గోరి యింతింతవై యంత కొండంతవై నీవు
బ్రహ్మాండము న్నిండుగా నిండురూపంబు వ్యా
పింపగా జేయవే మెండుగా రెండుపాదంబులన్
సర్వసర్వంసహా కాశముల్గప్పి యో చక్రవర్తి మ

హోరాజ యీయుద్ధ కాధారమున్జూప వేయన్న
దా మస్త్రకం బొప్పుగాఁజూప బంధించి పాతా
ళమందుంచవే వాసుదేవా జగద్రక్షకా జామ
దగ్న్యుండ వై రాజులం దొగ్గి ముయ్యేడు
మార్లొప్పుగా గెల్చి యాకశ్యపుం బిల్చి భూ
చక్రము న్దానమింపారఁగా నీయవే శ్రీధరా
హైహయాధీశు వే బాహువుల్ ఖండనం బో
ప్పుగా జేయవే నాకసోపానము ల్గట్టవే భార్గ
వుండంచు జేరొందవే మాధవా సూర్యవం
శంబునన్బుట్టవే రామనామాభిధానుండవై రా
తిని న్ఖ్యాతిగా జేయవే పక్షిరాజున్ కృపాసాగ
రంబందు తేలించి మోక్షంబు నాడీయవే చా
టుగానుండి బల్వాటమౌ బాణము న్వింటసం
ధించి హా వేటుకే వాలిప్రాణంబుల న్గొంచు
సుగ్రీవు గిష్కింధకున్ రాజుగా జేసి వారాన్ని
ధిం గట్టి యోపుండరీకాక్ష బల్ దండివై కుంభ
కర్ణాదులన్ చెండి చెండాడవే రావణున్ శంకలే

కుండదద్ఘ్రితకున్ లంకకుంబట్టముంగట్టవేరా
హు మార్తాండకోటిప్రభాభాసమానుండవై జా
నికింగూడి లోకంబులు న్మెచ్చ సాకేతమేలంగ
వేదే జగన్నాథ భూభారము న్మాన్పగా దేవకీ
దేవి గర్భంబున న్బుట్టి వ్రేపల్లెలోనుండి నం
దాదు లానంద మొప్పారగా బెద్దవై నేల
పై బ్రాకుచు న్మన్ను భక్షింప నాలోన నీ
తల్లి యన్నా యిదేమంచు నోర్విప్పగా జూ
పవా నీదు గర్భంబులో నేడుసంద్రంబు లీరే
డులోకంబు లీరేడు ద్వీపంబుల న్గొండల న్నట్ట
ల న్మెట్టల న్బట్టల న్వట్టుల న్పిట్టల న్జెట్టులం బ
ల్లెలం బట్నముల్ జంతుజాలంబుల న్మేడల
న్వాడల న్గోడల న్జాడలన్ సొంపు పెంపార
నేపాళ నాటాంధ్ర కర్ణాట గాంధార బాహ్లీ
క కాశ్మీర కాంభోజ సౌవీర సౌరాష్ట్ర మ
హారాది ఛప్పన్న దేశంబులున్ వాని రారాజు
లున్ రాజులుం జక్రవర్తు ల్మహాసార్వభౌ

ము ల్మహానంద మొప్పారగా రాజ్యముల్ చే
సి కోటానకో ట్లర్బుదంబు ల్మహాపద్మ సం
ఖ్యాకులుం జచ్చుట ల్పుట్టుట ల్చూడ నాలో
న గోదావరీ తామ్రపర్ణీ నదు ల్తారుట లీ
ర్థయాత్రాపరు ల్పుణ్యదేశంబుల జ్జేరుటల్
చూచుచుండంగ నాలోన స్వర్లోకము న్దొ
ప్పుగా జూడ రం భోర్వశీ మేనకాదు ల్మ
హేంద్రాది బృందారకు ల్నిండుగా గొల్వదీ
ర్పంగ వేచేరి యింపారగా దోడిరాగంబునందా
నవర్ణంబుల న్పాడుచున్నంతలో నొక్కరుం
డొప్పుగా లేచి యో మేనకా ఫీలువారాగ
మింపారగా పాడుమా యన్న నాలోన నారీ
మణు ల్పాడగా మెచ్చి బల్ గద్దెపై నుండి
యింద్రుండు కాన్కిచ్చుట ల్వింతతో జూడ
గా నంతలో మాయచే గప్పి బల్మందహాసం
బునన్వింతగా గంతవా మాధవా ముద్దులంగూ
ల్చి గంధర్వుల న్బ్రోవవా నక్రిమున్గూల్చి దం

తీశ్వరున్ గావవా శ్రీధరా గోపికాచిత్తచో
రా. రమానాథ రాజీవపత్రేక్షణా దీనబంధూ
కృపాళూ దయాసింధు రారా మదిన్గోపమేరా
యిదేన్యాయమారా మురారీశార్ఙ్గిపూర్వదేవా
రిశౌరీ మహావైరిజీవాపహారీ పురాద్రౌపదిన్
కౌరవుల్ క్రూరులైపట్టి నిండోలగంబందు సందే
హమున్ లేక పుట్టంబులన్బట్టి యొల్వంగ బాం
చాలి కృష్ణా జగద్రక్షకా దీనరక్షామణీ భక్త
చింతామణీ దైవచూడామణీ ప్రోవరాయంచు
నిష్ఠురగాఁ జీరలీలేదె గోపాల గోవర్ధనోద్ధారణా
రంగధామా మహాశత్రుభీమా భళీ సార్వభౌ
మా కురుక్షేత్రవాసుల్ కరంబల్గి పోరాడుచో
కోటియుండన్ నిరాధారులంగూడి వేరాయు
ధారంబు సల్పంగ నాలోన దుష్టుల్ దురాచా
రు లౌకర్ణ దుశ్శాసనాదుల్ మహాయంత్రము న్వ
చ్చి సిగ్గట్టయత్నింపగా విశ్వరూపంబు జూపిం
పగా నాంబికేయుండు నేత్రంబులన్గోరగానిచ్చి

దనం బొప్పుగా జేయుచున్ ద్రోణగాంగేయు
ల న్మొండిగా జేయ నాలోన భీముండు భీమాశ్వ
థిస్యుని రారాజు జేబట్టి బంధించి యుగ్రింబు
గా నూర్వుభాగంబులన్గోర్కి దీరంగ భంగంబు
గావింపగా జూచి భీమా భళీయంచు మెచ్చన్
సురల్ పుష్పవర్షంబు వర్షింపగా నంతలో న
ప్సరల్ నాట్యముల్సల్పగా జేయవే ధర్మరాజు
న్మోదంబొప్పగా శ్రీధరా కృష్ణ భూభారమున్మా
న్పవా బ్రహ్మకున్బ్రహ్మవై గోవులన్వత్సలన్బా
లురన్ సృష్టికిన్మారుగా సృష్టినిన్జేసి మున్ బ్రో
వవా కృష్ణ బుద్ధావతారం బబద్ధంబు గాకుండ
బుద్ధుండవై యుద్ధతేజుండవై శ్రీజగన్నాథనా
థుండవై మూడులోకంబులన్ బ్రోవవా యా
దదుద్ధారకా దేవదేవోత్తమా తామ్రపర్ణీనదీ
తీరమం దొప్పుగా శంబళగ్రామవాసుండవై
విష్ణుదేవాభిధానంబుచే నుప్పు భూదేవగర్భం
బునన్పుట్టవే కల్కివై ఖడ్గమున్ హస్తమందో

వ్వుగా బట్టి దుర్మార్గుల నట్టి ఖండింపవా శిష్టు
లన్ బ్రోవవా జాతులన్ వృత్తులం. జక్క
నం జేయవా పూర్వమందందమా నందిని స్గంగి
రెద్దంచు బల్ పొందుగాదిద్ది యాయిందిరానా
థ యాబొమ్మ కంఠంబునస్వీరణంబుంచి యిం
దాద్రిదులున్వెన్క బాడంగ జేజేలు శ్లాఘంబు
లన్గొట్టగా నాయకుండంచు బేరొంది నాగాసు
రున్జేరి బల్ దండివై ముందుగా రెండుహస్తంబు
లన్ పొందుగా నిండుగా జాచి యానందమొ
ల్కంగ సాష్టాంగముల్ చేయుచు న్మెండు
గా వెండి సన్నాయితో బాడుచున్ చిందు
లన్ద్రొక్కుచున్ జేతులాడించుచున్నందినా
డించుచున్ సుందరాకారబల్మందహాసంబులన్
ముద్దులన్దెల్పి నీ వింద్రజాలుండవై శంకరున్గోరి
యాశాంకరిన్ బ్రోవవా కృష్ణమృద్భక్షణా దు
ష్టసంశిక్షణా శిష్టసంరక్షణానీకటాక్షంబునాపైని
పొంపారగా జూపవాయంచు నీపాదపద్మంబుల

న్గాల్చెదన్ బుద్ధిహీనుండ నోపద్మనాభా సదా
నెమ్మదిన్నమ్మిధ్యానించి సాష్టాంగముల్ చేసె
దన్ దేవ! లోకంబులో దండ్రి దండింపడే బిడ్డ
లన్దప్పులన్జేయ నో యాదవాగ్రేసరా తప్పుల
న్దిద్ది రక్షింపరా దేవరారా దయన్ బ్రోవవేరా
కృపాసాగరా శ్రీహరీ సూర్యచంద్రాదులుం జు
క్కలున్ సంద్రముల్ ల్గోత్రము ల్పంచభూతం
బు లీశేశులోకంబులు న్నీవకావే మహాదేవ
నీభక్తులన్ బ్రోచుటే చోద్యమా దేవ వా
టంబుగా జల్లపేటాగ్రహారంపువాసుండ నో
దానమందార గంట్యాన్వయాంభోధి పూర్ణేందు
వద్వేంకనార్యద్వితీయాత్మజుండై నశ్రీసూర్యనా
రాయణాఖ్యాతు డానందమొప్పారగా రాక్ష
సాబ్దంబులో నాశ్వినంబందు శుక్లాష్టమీ శుక్ర
వారంబునం జెప్పె నీదండకం బొప్పుగా నాత్మ
లో నన్యభావంబు లేకుండ ధీయుక్తులై వ్రా
సినం దిన్నగా నాలకింపన్ బఠింపంగ వారల్

భువి న్వృద్ధకాలంబు దీర్ఘాయురారోగ్యసంపత్సు
పుత్రాదుల న్బొందుటంగాక యంతంబునవిష్ణు
సాన్నిధ్యముం న్బొందరే కృష్ణ గోపాల సత్కీర్తి
లోలా నమస్తే నమస్తే నమః.

సంపూర్ణము.



